## సదాశివ సమారంభాం


గురు దక్షిణామూర్తి


గురు వేదవ్యాస మహర్షి


గురు శుక మహర్షి


గురు నారద మహర్షి


గురు వాల్మీకి మహర్షి


గురు శ్రీకృష్ణ

## శంకరాచార్య మధ్యమాం


గురు దత్తాత్రేయ


గురు బాబాజీ


గురు గౌతమ బుద్ధ


గురు ఆదిశంకరాచార్య


గురు రామానుజాచార్యులు


గురు జ్ఞానేశ్వర్


గురు రవిదాస్


గురు కబీర్ దాస్


గురు చైతన్య మహా ప్రభువు


గురు నానక్


గురు రాఘవేంద్ర స్వామి


గురు వీరబ్రహ్మేంద్ర స్వామి


యోగి వేమన

## అస్మదాచార్య పర్యంతాం


గురు త్రైలింగ స్వామి


గురు లాహిరి మహాశయ



గురు రామకృష్ణ పరమహంస, అమ్మ శారదాదేవి


గురు వివేకానంద


గురు సాయి బాబా


గురు అరబిందో


గురు రమణ మహర్షి


గురు యోగానంద


గురు భక్తివేదాంత ప్రభుపాద


గురు మళయాళస్వామి


గురు విద్యాప్రకాశానందగిరి


గురు చంద్రశేఖర పరమాచార్య

## వందే గురుపరంపరాం..




నన్ను "నేను" తెలుసుకోవటానికి

నన్ను "నేను" మార్చుకోవటానికి

"నేను" గా ఉండటానికి

మరియు అత్యుత్తమ జీవన విధానానికి

కావలసిన భక్తి,జ్ఞాన,కర్మ,ధర్మ సమాచారం ఒకేచోట తెలుగులో ఉచితంగా!

సాధారణంగా వేదాంతం తెలుసుకోవాలనే కోరిక వుంటుంది, కాని గ్రంధాలు అందుబాటులో లేవు. ఇంకొకరి దగ్గర గ్రంధాలు వుంటాయి, కాని జిజ్ఞాసువులకి ఎక్కడ ఉన్నవో తెలియదు. అలాగే కొన్ని లైబ్రరీ లో కొన్ని రకాల పుస్తకాలు మాత్రమే లభ్యం అవుతున్నాయి, అంతేగాక విలువైన గ్రంధాలు సరైన సంరక్షణ లేక కనుమరుగైపోతున్నాయి, కనుక మన అందరి కోసం భారత ప్రభుత్వం పురాతన ఆధ్యాత్మిక గ్రంధాలను సంరక్షించే నిమిత్తం ఎంతో శ్రమతో కంప్యూటరీకరణ ద్వారా ఒక చోట చేర్చుతూ ఆన్ లైన్ చేయటం జరిగింది. ఇటువంటి విలువైన జ్ఞాన సంపదను మరింత సులభంగా అందుబాటులోకి తీసుకురావటానికి సాయి రామ్ సేవక బృందం ఉడతా భక్తి గా ఇప్పటివరకి దాదాపు **5000** పుస్తకాలను వివిధ వర్గాలుగా విభజించి PDF(eBOOK) రూపంలో ఆన్ లైన్ లో ఉచితంగా అందించటం జరిగింది. కనుక ప్రతి ఒక్కరు ఈ సదవకాశాన్ని సద్వినియోగం చేసుకోగలరు. ఇందుకు సహాయం అందించిన భారత ప్రభుత్వపు వెబ్ సైట్( డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా http://www.new.dli.ernet.in), ఆర్కైవ్ వెబ్ సైట్(https://archive.org), గూగుల్ వెబ్ సైట్(https://www.google.co.in), మైక్రోసాఫ్ట్ వెబ్ సైట్(http://www.microsoft.com) కు మేము ఋణపడివున్నాము.అలాగే ఇటువంటి బృహత్తర కార్యక్రమానికి పెద్ద మొత్తం లో గ్రంధాలను అందించిన తిరుమల తిరుపతి దేవస్థానమునకు కూడా మనం ఋణపడివున్నాము. సాయి రామ్ సేవక బృందం కోరుకొనేది ఒక్కటే, ప్రతి ఇల్లు ఆధ్యాత్మిక జ్ఞాన గ్రంధాలతో నిండిపోవాలన్నదే మా కోరిక.

ఈ గ్రంధాలను ఉచితంగా ఆన్ లైన్ లో చదువుటకు, దిగుమతి(డౌన్లోడ్) చేసుకొనుటకు గల మార్గాలు:

1) భారత ప్రభుత్వపు వెబ్ సైట్: http://www.new.dli.ernet.in లేక http://www.dli.ernet.in
2) సాయి రామ్ వెబ్ సైట్: http://www.sairealattitudemanagement.org
3) సాయి రామ్ గూగుల్ సైట్: https://sites.google.com/site/sairealattitudemanagement
4) ఆర్కైవ్ వెబ్ సైట్: https://archive.org/details/SaiRealAttitudeManagement

ఈ జ్ఞాన యజ్ఞం పై గల సలహాలు,సూచనలకు సేవక బృందాన్ని సంప్రదించుటకు: sairealattitudemgt@gmail.com

సాయి రామ్ భక్తి,జ్ఞాన సమాచారం: https://www.facebook.com/SaiRealAttitudeManagement

సాయి రామ్ భక్తి,జ్ఞాన సంబంద వీడియోలు: https://www.youtube.com/user/sairealattitudemgt

ఈ జ్ఞాన యజ్ఞంలో ప్రతి ఒక్కరు పాల్గొని, ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకొని,మీరు సంతృప్తులైతే మరొక సాధకునికి, జిజ్ఞాసువులకు మార్గం చూపించగలరని ఆశిస్తున్నాము. మీరు చదువుకోవటంలో ఏమైనా ఇబ్బంది కలిగితే సేవక బృందంను సంప్రదించగలరు. ఒకవేళ మా సేవలో ఏమైన పొరపాటు వస్తే మన్నించగలరు.

ఈ గ్రంధపు భారత ప్రభుత్వ డిజిటల్ లైబ్రరీ గుర్తింపు సంఖ్య: 2020010004242

## భారత ప్రభుత్వపు వెబ్ సైట్ - డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా

## http://www.new.dli.ernet.in

Digital Library of India: Inc ×

www.new.dli.ernet.in

# Digital Library of India

Hosted by: Indian Institute of Science, Bangalore in co-operation with
CMU, IIIT-H, NSF, ERNET and MCIT for the Govt. of India and 21 major participating centres.

Home | Vision | Mission | Goals | Benefits | Content Selection | Current Status | People | Funding | Copyright Policy | FAQ | RFP

Books Journals Newspapers Palm-Leaves (Manuscripts)

Title: Ramayanam
Author:
Year: to
Subject: Any Subject
Language: Telugu
Scanning Centre: Any Centre
Clear | Search

Presentations and Report
Statistics Report
Status Report
Feedback | Suggestions | Problems | Missing links or Books

Click here for PDF collection
DLI MIRROR at IUCAA Data Center PUNE

DLI

For the first time in history, the Digital Library of India is digitizing all the significant works of Mankind.

Click Here to know More about DLI New!

| Books | Journals | Newspapers | Manuscripts |
|---|---|---|---|
| Rashtrapati Bhavan | INSA | Times of India | Tamil Heritage Foundation |
| CMU-Books | | Indian Express | AnnaUniversity NEW! |
| Sanskrit | | The Hindu | |
| TTD,Tirupathi | | Deccan Herald | |
| Kerala Sahitya Akademi | | Eenadu | |
| | | Vaartha | |

Title Beginning with.

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

Author's Last Name

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

Year

1850-1900 | 1901-1910 | 1911-1920 | 1921-1930 | 1931-1940 | 1941-1950 | 1951-

Subject

Astrophysics | Biology | Chemistry | Education | Law | Mathematics | Mythology | Religion | For more subjects...

Language

Sanskrit | English | Bengali | Hindi | Kannada | Marathi | Tamil | Telugu | Urdu

# అతి విశిష్టం ఈ దానం!

స్వామి వివేకానంద

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.



రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, జవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖

మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

# ఆత్మోపహారము

[ సర్వలోకేశ్వరశతకము ]



[illegible]

బులుసు వేంకటేశ్వరులు



బి. వి. అండ్ సన్సు,
రామారావుపేట, కాకినాడ

1955 డిసెంబరు

Re 0.50

పునర్ముద్రితము

వెల 0-8-0

# ఒక్క మాట

"ఆత్మోపహార" మనుపేర నీశతకమును 1947 సంవత్సరము ౧౦౮ పద్యములు వ్రాసి ప్రకటించితిని. వెంటనే ప్రతులు చెల్లిపోయినవి. దానిప్రతులకై పలువురు మిత్రులు కోరినను, వెంటనే పునర్ముద్రింపవలసియున్నను, కారణాంతరములచే నది నేఁటిదనుక పునర్ముద్రితము కాలేదు.

ప్రస్తుతముద్రణమున "శర్వా! సర్వలోకేశ్వరా!" అను మకుటము చేర్చితిని. గురు శివాభేదరూపక మగు నీశతకమును బండితపామరులు మెచ్చి ప్రతులకై తొందరపెట్టుటచే నే నిపుడు ముద్రింపక తప్పనిసరియైనది. నే నుపేక్షించుటకుఁ గారణ మిది: భగవద్భక్తసంబంధము. రహస్యముగనే యుండవలసినది. అట్లే గురుభక్తసంబంధమును ఇది కేవలము వ్యక్తిగతము. అట్లని తాము ను బాలుపంచుకొని యానందింత మనువా రున్నపుడు వారిని దృణీకరించుట ధర్మముకాదు. ఈకారణముచే వలదనుకొన్నను నిది ముద్రింపవలసివచ్చినది.

పరిహాసరచనలపైఁ బ్రాణ మున్నవారికిఁ బరమార్థరచనలపైఁ గంటగింపుండకమానదు. వారి కిది యుద్దేశింపఁబడలేదు.

గ్రంథకర్త.

# ఆత్మోపహారము

## [ సర్వలోకేశ్వర శతకము ]

---

శ్రీశ్రీశ్రీగురుదేవపాదజలజ శ్రీమత్సుధావార్ధి వి
శ్వశ్రేయసముపార్జనంబునఁ బరబ్రహ్మాప్రమోదాప్తికై
స్వశ్రేయస్కరబుద్ధిషట్పదము లుత్సాహించి క్రోలున్ మహ
త్వశ్రీలౌ నమృతంపుబిందువులు శర్వా! సర్వలోకేశ్వరా! ౧

నీ కారుణ్యకటాక్షలబ్ధవితానిశ్శేషనిత్యప్రస
న్నాకల్పుండను దొల్లి వ్రాసితిని దేవా! నీకు నర్పించితిన్
నా కావ్యంబులు పెక్కు భక్తిభరితానందప్రపూర్ణాత్మతన్
ప్రాకామ్యంబు నొసంగి ప్రోచితివి శర్వా! సర్వలోకేశ్వరా! ౨

భవదీయస్మరణంబె నా కెపుడు నాపత్సింధుపోతం బగున్
భవరోగంబులఁ బాపు వైద్యగుఁ బరబ్రహ్మానుభావప్రభా
భవమై యొప్పుచునుండు నా కదియ నిత్యస్తుత్యగాయత్రియై
భవభక్తిప్రదమై సదా మనుచు శర్వా! సర్వలోకేశ్వరా! 3

పరమోత్కృష్టము నాదు జన్మము మహాభవ్యంబు నా వర్తనం
బు రమాధీశ్వర పట్టభద్రుఁడను నఁ ముమ్మాటికిం బోలఁడం
బురుహోద్భూతుఁడుఁ దక్కుదేవతలు నింద్రోపేంద్రు లేలెక్క? త
త్పరమానందసుఖస్వరూపుఁడను శర్వా! సర్వలోకేశ్వరా! ౪

ఆజన్మాంతముఁ గోరుకొందుఁ బరమాత్మానూనసంధాన, మే
నేజన్మంబుల నెట్టిపుణ్యముల నేయేవేళలం జేయ వి
భ్రాజత్స్ఫురమొ? త్వావకీనపదసేవాభాగ్యయోగంబు, దే
వా! జాగ్రత్పరిణామ మిమ్ము దయ శర్వా! సర్వలోకేశ్వరా! ౫

నీ సంకల్పము దైవనిర్ణయము త్వన్నిర్మలస్వవాక్యంబు లా
నాసంకర్షణువాక్యముల్ తలఁపఁగా నా దీవు బ్రహ్మంబు త్వ
ద్దాసత్వంబు జరాజనిప్రతతి కుద్దాలంబు బ్రహ్మర్షివ
ర్యా! సద్యోగివరేణ్యా! ప్రోవు నను శర్వా! సర్వలోకేశ్వరా! ౬

నీ పాదంబుల నాశ్రయించినవి తండ్రీ! సర్వతీర్థంబులుం
నీ పంచన్ భయభక్తిఁ జేరి కొలుచున్ నిర్వాణసుజ్ఞానముల్
నీపాలంబడి నిల్చియున్నవి జగన్నిర్మాణశక్తుల్ ప్రభూ!
ప్రాపై ప్రోవుము నన్ను వత్సలత శర్వా! సర్వలోకేశ్వరా! ౭

కీకారణ్యమునందు నుండి దివిజశ్రేణింకరం బైన యా
నాకంబందు వసించు దివ్యసుఖముల్ గైకొన్నయట్లుండఁగా
లోకాన్నత్యదసాధసౌఖ్యముల పై లోలత్వమున్ బాపి దే
వా! కల్పింపు నితాంతనిస్పృహను శర్వా! సర్వలోకేశ్వరా! ౮




బ్రహ్మజ్ఞానము నాపుదాల్చితివి మా ప్రత్యక్షపుణ్యంబుగా
బ్రహ్మర్షిప్రవరుండవైతి గురురూపం బద్దియే కానివో
బ్రహ్మేంద్రాదులు నందఁజాలని మహాప్రజ్ఞానవిజ్ఞానముల్
బ్రహ్మత్వంబు గడించు టెట్లిఁకను శర్వా! సర్వలోకేశ్వరా! ౯

నీ సేవాపరిపూర్ణకాంక్ష యదివో నిర్వాణసామ్రాజ్యల
క్ష్మీసింహాసనసుప్రతిష్ఠిత సుఖశ్రీప్రాప్తిమూలంబు నా
నీ సాంగత్యమహాభిలాషము జగన్నిర్మాణచాతుర్యశో
భాసాదృక్షము వేయునేల? యిఁక శర్వా! సర్వలోకేశ్వరా! ౧౦

భవదీయంబగు సత్కృపాగరిమ సంపాదించినం గాని నే
భవఘోరాంబుధి దాఁటఁజాలను భవత్ప్రాప్తిం మనంజాల; నీ
సవిశేషం బగు సత్కృపం బడయుఁగా శక్తుండ నేఁ గాను నీ
వనశేణ్యంబుగఁ బ్రోవకున్న యెడ శర్వా! సర్వలోకేశ్వరా! ౧౧

నీ సర్వాంకషపాండితీగరిమ త్వన్నిర్మోహసంపత్తియున్
నీ సాంగత్యమహానుభావము భవన్నిష్ణాతసౌందర్యమున్
నీ సాన్నిధ్యమహాప్రకాశము జగన్నిర్మాణచాతుర్యమున్
వాసించుంగద! మేలుబంతు లయి శర్వా! సర్వలోకేశ్వరా! ౧౨

నీ నామం బొకమాఱు జిహ్వాపయినిన్ నిల్పంగ నాపిమ్మటన్
నీ నారాయణరూప మాత్మను గడున్ నిష్ఠన్ బ్రదర్శింప, త్వ
న్నానాదివ్యచరిత్ర మొక్కపరిఁ బుణ్యాం బంచు నాలింప, దే
వా! వర్తించు నరుండు నీవయయి శర్వా! సర్వలోకేశ్వరా! ౧౩

నీవే నాదగు సర్వమంచు మదిలో నిష్ఠాత్మ భావించుచున్
రావే కావవె యంచు నార్తి నినుఁ జేరం బిల్చి చింతించినన్
భావింపంగ సమస్తధర్మములు నీపా లన్న భావంబుతో
రావా? యన్నను వచ్చితీ రెదవు శర్వా! సర్వలోకేశ్వరా! ౧౪

ఆపద్బాంధవుఁ డన్నదైవ మన సర్వానందమూలం బనన్
బాపారణ్యదవానలుం డన జగద్భద్రప్రభుం డన్ననున్
నాపై సత్కృప నించు దివ్యుఁడు జగన్మాన్యుం డనన్ నీన దే
వా! ప్రోవంగదె నిత్యమున్ కృపను శర్వా! సర్వలోకేశ్వరా! ౧౫

చరితార్థంబులు జీవితంబులని సుస్వాంతంబులన్ బొంగిపో
దురు దేవా! నినుఁ గన్న సర్వజను లెంతో నీకటాక్షంబుచే
నరుదే తాము సనందనాదు లని గర్వానందులై యుండఁగాటల్
పరమేశుం గని యాడువారుగద శర్వా!సర్వలోకేశ్వరా! ౧౬

రాతి న్నాతిని జేసినట్టి తొలి శ్రీరాముండవా నీవెనన్ ... చ
ట్రాతిన్ బ్రహ్మవిదుం బొనర్చిన జగద్రక్షాత్ముఁడవా నీవు ...
రీతిం బోలఁగఁ జాల రన్యులు నినున్ శ్రీభక్తరక్షప్రభు
ప్రాంతన్ నన్ను ననుగ్రహింపఁగదె శర్వా! సర్వలోకేశ్వరా! ౧౭

ఆనందంబున నప్పుటప్పటికి భక్త్యావిష్టతన్ దేవ! నీ
గానాలాపము చేయుచుండెదను మత్కంఠారవాసిగ్గతి
జ్యానాదంబు భయంకరారులకుఁ బ్రాణాపాయమై ... డే
వా! నిత్యామృతవృష్టిఁ దేల్చు నను శర్వా! సర్వలోకేశ్వరా!

నిన్నుం గోరెడు భక్తవర్యులకడన్ నీ వుండు దెల్లప్పుడున్
నిన్నుం గొల్వఁగఁబోవువారికడకున్ నీవై చనంబోదు వే
నెన్నంజాలను దావకీనకృప నింతేనిన్ మహాదేవ! ఆ
పన్నత్రాణపరాయణా! శరణు శర్వా! సర్వలోకేశ్వరా! ౧౯

వనితాగారసుఖానుభోగములఁ జీవంబున్ వితాచేయుచున్
దనుఁ దా నేమి యెఱుంగలేక తనువే తథ్యంబు తా నంచు దు
ర్జనుఁ డందున్ మృషయౌ సుఖంబుఁ దన సంసారంబునన్ జిక్కి యె
వ్వనికిన్ సౌఖ్యముగాదు ని న్నెఱుఁగ శర్వా! సర్వలోకేశ్వరా!

గురుదేవా! భవదీయదివ్యచరితల్ క్రోడీకరింపంగ శ్రీ
కరముల్ భారతసంహితల్ బహుళసత్కావ్యప్రబంధంబు లౌ;
పరమానందము లోకసంతతి కగున్ భక్తావళిం బ్రోచు నీ
వరవాత్సల్యవిశేష మెంచెదను శర్వా! సర్వలోకేశ్వరా! ౨౧

క్షణికం బైన విశాలవిశ్వమున నీ సాంగత్యభాగ్యంబు తా
నణువై మేరుసమానసత్ఫలము నీయంజాలు నీనామమే
ప్రణవోచ్చారణ మొక్కసారి వినినన్ బాపాటవుల్ కూలు నిన్
ప్రణుతిం గొల్చినవారెపో సురలు శర్వా! సర్వలోకేశ్వరా! ౨౨

మాటల్ చాలవు నీగుణంబులను నేమాడ్కిన్ ప్రశంసింపఁగా
నాటల్ పాటలు గావు శక్తి యిది తా నల్పంబె యౌరాఁ గాన; నీ
మాటల్ మానగు మంత్రతంత్రములు బ్రహ్మజ్ఞానమూలంబులున్
బాటింపం దగు మాకు నెల్లపుడు శర్వా! సర్వలోకేశ్వరా! ౨౩

నిను సేవింపఁగ సబ్బు సంపదలు ని న్జింతింప మాంగళ్యముల్
వెనువెంటన్ బొడసూపు నిన్నుఁ గనఁగా విశ్వాత్మభావంబుఁ దోఁ
చును సర్వంగతుఁ డైనవాఁడ వగుటన్ జోద్యంబె సర్వంబు న
ప్పనముం జేసిన దేవదేవుఁడవు శర్వా! సర్వలోకేశ్వరా! ౧౪

గురువే లేఁడు మహాగురుత్వముగ వైకుంఠం దగన్ మించినా
వరుగన్ లేదు పఠింప నెయ్యెడను శాస్త్రార్థంబుల న్నేర్చినా
వరయన్ లేదు జగంబుఁగాని ఘనలోకార్థంబులన్ మించి స
ర్వరహస్యజ్ఞుఁడ వైతి లోకగురు శర్వా! సర్వలోకేశ్వరా! ౧౫

నలసారం బగు సంసృతిం దొరఁగి మాన్యం బైన దివ్యస్థితిన్
బొలుపొందం గన యాత్మతత్త్వమును సంపూర్ణంబుగాఁ గాంచియు
వ్వల వైరాగ్యమునందు రాగియగు నిన్భావించు భక్తుండను; ని
న్బలుమార్గంబుల సంస్తుతించెదను శర్వా! సర్వలోకేశ్వరా! ౧౬

భవదీయంబగు సత్కృపాగరిమ సంప్రాప్తించు భాగ్యంబు సం
భవముం జేసి నను న్ద్వదీయుఁ డని చెప్పంజూడఁగాఁ గోరుదున్
భవపాశంబుల నొక్కపెట్టునను ద్రుంపంజాలు భాగ్యంబు దే
వ! వరంబుల్ గృపసేయు మింకిపుడు శర్వా! సర్వలోకేశ్వరా! ౧౭

కడునీచం బగు నాదు జన్మమును నీకారుణ్యసంప్రాప్తిచేఁ
గడుశోభాకరముం బొనర్చితివి నీకారుణ్యమే లేనిచోఁ
నడుగంగావలెనా మదీయ మగు జన్మానంతదుఃఖస్థితిన్
బడయంగాఁగలనే సుఖస్థితిని శర్వా! సర్వలోకేశ్వరా! ౧౮

జగదుద్ధారక మామహామహిమతో జన్మించి మా కెన్నఁడున్
సుగతుల్ గల్గఁగఁజేసి దివ్యమహిమన్ క్షోణీతలంబందె స్వ
ర్గగతుల్ సృష్టియొనర్చి నిత్యమయి శంకాగ్రంథివిచ్ఛేదస
ర్వగరిష్ఠం బగు జ్ఞాన మిచ్చితివి శర్వా! సర్వలోకేశ్వరా! ౨౯

సౌజన్యంబుఁ గృపాపరాయణత యాజన్మప్రసిద్ధంబులై
పూజన్ గాంచిన యయ్య నీకడను నీపుణ్యం బగణ్యంబు నే
యోజం గాంచిన నీసమానుఁ డిఁక లేకుం డబ్బురంబే? మహా
రాజ ప్రస్ఫుటదేవదేవుఁడవు! శర్వా! సర్వలోకేశ్వరా! 30

అణువై గీ వణువై మహామహిమ బ్రహ్మాండానుభావుండవై
గణనీయంబయి వెల్గువెల్గును గసంగాఁ జాలి బ్రహ్మర్షివై
గుణులందుం గుణివై తపర్చు నిను నేఁ గొల్తున్ మహాభక్తితోఁ
బ్రణవాత్ముండవు జ్ఞానమూర్తి వని శర్వా! సర్వలోకేశ్వరా! 3౧

కైలాసంబు నివాసభూమి త్రిజగత్కళ్యాణమే వృత్తి యా
లోలం బౌసురవృక్షమూలమె సుఖాలోలాత్మపీఠంబుఁ గా
వ్యాలంకారవిశేషభూషల కలభ్యం బైన దేరూపు లీ
లాలోలుండవు వదేవుఁడవు శర్వా! సర్వలోకేశ్వరా! 3౨

పలుకుం బల్కనఁ దేనెలూరు, మఱి హృత్పద్మంబు జృంభించు నీ
విలసద్గానసుధాప్రవాహనివహావిర్భూతవిద్యుత్తరం
గలసచ్ఛీల సరోత్తమోత్తమునకున్ గాంభీర్యధైర్యంబులన్
వలగొన్నట్టి మహానుభావుఁడవు శర్వా! సర్వలోకేశ్వరా! 33

కామక్రోధమహాపిశాచము లహంకారంబు మోహాదులున్
భీమప్రౌఢిమఁ దాఁకె నన్ను నతిగా భీతుం బొనర్చు న్విభూ!
నామానంబున వానినిం దునుమఁగానం జాల దేవాదిదే
వా! ముఖ్యారులఁ దున్మి కావు నను శర్వా! సర్వలోకేశ్వరా!

ఈలోకంబున జీవమాత్ర పరమాహ్లాదప్రభావంబు సం
పాలింపంగను పారలౌకికమహాభాగ్యంబుఁ గైకొఁగ నీ
వాలోకించి మముం బొనర్చితి ద్వయమార్గం బైన పుణ్యాళిగాఁ
పాలింపంగదవే త్రికాలముల శర్వా! సర్వలోకేశ్వరా! ౩౫

నిద్రాహారము లీ వెఱుంగవు మహానిర్ణిద్రసౌభాగ్యసం
పద్రాజ్యంబున సుస్థిరుండవు జగద్భద్రానుసంధాయివై
క్షుద్రం బౌ నిహలోకసౌఖ్యముల నక్షుద్రప్రభావంబుతో
భద్రాత్మా! త్యజియించి మించితివి శర్వా! సర్వలోకేశ్వరా! ౩౬

నీ వేదంబు లెఱుంగఁగా మఱి భవన్నిత్యప్రభావంబు నీ
వాచామాధురి నీవివేకగుణమున్ భక్తానుకంపాత్మయున్
ప్రాచుర్యం బగు తావకీనసుగుణవ్రాతంబు లెక్కింపఁగా
వాచోభర్తకు నైన వీలగునె? శర్వా! సర్వలోకేశ్వరా! ౩౭

ఒకమారైనను నీముఖాంబురుహ మత్యుత్సాహసంస్ఫూర్తితో
నకలంకాత్ములు చూచుచో నదియు బ్రహ్మానందమే యిచ్చు వా
రికి నింకన్ గడుభక్తితోడ నినుఁ దండ్రీ! నిత్యము న్గొల్చువా
రకదా! దైవతమూర్తు లీభువిని శర్వా! సర్వలోకేశ్వరా! ౩౮

పరమేశా! భవదీయసత్కృపమహాభాగ్యంబు నేఁ గన్నచో
సరిరా రెవ్వరు మూఁడులోకముల నాశ్చర్యంబు నాకు న్విభూ!
పరిపూర్ణం బగు తావకీనకృప నాపైఁ బర్వినన్ నేనె త్వ
ద్వరరూపంబున నెక్కనై మనుదు శర్వా! సర్వలోకేశ్వరా! ౩౯

త్రిజగత్పావన మైన నీచరితఁ గీర్తింపం దొరంకొంట యు
క్కజ మాయుఃప్రద మైహికార్థఫలకాంతాలభ్యశోభాకరం
బు జనిన్ రూపడఁగించు నౌషధము సమ్మోహజ్వరధ్వంసి స
ర్వజగత్స్తుత్యము మోక్షదాయకము శర్వా! సర్వలోకేశ్వరా!

నిను సేవించిన యాత్మలం బెనరు నిర్నిద్రప్రభారేఖ ల
ల్లన నాచ్ఛాదనముం బొనర్చి సుమనోలక్ష్మీప్రదుం జేయు ము
క్తిని హస్తగతముం బొనర్చు నిఁకఁ దాదృశంబు లేదందుఁ బ్రా
ణసజీవా! పరమాత్మరూప! శివ! శర్వా! సర్వలోకేశ్వరా! ౪౧

పరసేవాపరసంస్తుతి ప్రవణతల్ పాటింపఁ గోరన్ నిరం
తరమున్ దావకపాదపద్మవిలసద్ధ్యానంబుఁ ద్వత్సేవయున్
గరుణాసాంద్ర! యొసంగు నాకు నది భాగ్యంబంచు భావించి నీ
వరరూపంబు భజించికొందు నిఁక శర్వా! సర్వలోకేశ్వరా! ౪౨

నినుఁ గొల్వ న్సమకట్టి యున్ననిక మహానిష్ఠాగరిష్ఠుండు బ్ర
హ్మ నుపాసించి గడించె నిత్య మగు నాత్మానందసింహాసనం
బును వే యొక్కఁడు వేనవేలుగ ధనంబుల్ గీర్తిఁ గాంచె న్మహా
వని నింకొక్కరుఁ జేటు టబ్బురమె శర్వా! సర్వలోకేశ్వరా! ౪౩

ఆలుంబిడ్డల నేలుకీతిఁ గుసుమాస్త్రాజీవహింసాస్థితిన్
గాలుం గల్పెదురీతి లోకమున దుష్కార్యప్రవృత్తాత్ములన్
ద్రోలంజాలెడి శక్తియుక్తుల తెఱంగున్ జూప నీవే కదా!
వాలాయంబుగ మార్గదర్శి విక శర్వా! సర్వలోకేశ్వరా! ౪౪

కామక్రోధమదాదిశత్రువులచేఁ గాయంబు సంతప్తమై
భామాలింగనసౌఖ్యమందు మది సంభావింపఁ బోనీక సా
క్షేమప్రస్ఫుటదివ్యమార్గమున శిక్షింపంగ లేకుంటె దే
వా! మాన్యాత్మ! కృపాత్ముఁ గైకొనుము శర్వా! సర్వలోకేశ్వరా!

కాముం బాములఁ బెట్టి పోనడఁచి నిష్కాముం దగం జేసి సు
త్రామాదుల్గనలేని సుస్థితి మహాత్మా! నాకుఁ గల్గింపు ని
ర్నామంబే పదివేలు సేయును సవర్ణ్యం బద్ధ యైనాఁగిఁకన్
రామాత్మోపతి కీడు నీవెకద! శర్వా! సర్వలోకేశ్వరా! ౪౬

కామక్రూరుని బాపి క్రోధుఁ గడఁగన్ శోకాకు లోంగాఁ జేసి నా
ర్మాము న్లోభుని రూపుమాపి కడుదుర్మార్గుండగు మోహుఁ బాయఁ జేసి
ర్మామున్ వాని నొసర్చి యంత మదు సన్నాహంబును ద్రుంచి దే
వా! మాత్సర్యుని జంపి బ్రోవు మను శర్వా! సర్వలోకేశ్వరా!

ఘోరానేకమహోఘపంకమున నాకీ జన్మమే కల్గనీ
పారావారవిహీనసంసరణపాపౌఘాబ్ధిలో మున్గనీ
సారాసారవివేకహీనజనసంసర్గంబె సన్ముట్టనీ
ప్రారబ్ధం బెటులున్న నిన్విడువ శర్వా! సర్వలోకేశ్వరా! ౪౮

దారప్రాప్తమమత్వదుఃఖదమహాదారిద్ర్యమే కల్గనీ
క్రూరానేకరిపుప్రభీకరమహాఘోరస్థితుల్ గల్గనీ

యూరాత్రిందివదుర్నివారకలుషౌఘాళిన్ ననుం బొందనీ
ప్రారంభించితిఁ గొల్వఁగా విమల శర్వా! సర్వలోకేశ్వరా! ౪౯

కరుణాశూన్యుఁడనై నశించుచు మహాకష్టంబులన్ గ్రుంగఁగాఁ
బరిపాటిన్ ననుఁ గొట్టి త్రొక్కి నరకప్రాప్తిన్ లభింపించినన్
బరమాఘంబులఁ బ్రోవు నాపయిని నీవై తెచ్చి బంధించినన్
బరమాత్మా! నిను వీడఁజాల నిఁక శర్వా! లోకేశ్వరా! ౫౦

నీ సన్నేత్రజాయమానకరుణానిర్మగ్నవీక్షాళి ని
త్యానందప్రదవాఙ్మణిస్థగితదివ్యాత్మప్రబోధాద్భుతా
నూనప్రస్ఫుటరత్నహారము ననుం బుణ్యాత్మునిం జేసి దే
వా! నిత్యోత్సవ మబ్బఁజేసినది శర్వా! సర్వలోకేశ్వరా! ౫౧

నీనాకళ్యాణగుణప్రకీర్తనము నిర్మింపంగఁ జాలు న్విభూ!
సాకల్యంబుగ మోక్షరాజ్యపదవీసమ్యాక్సవిస్తారసా
ఖ్యాకల్పప్రభుతాప్రసక్తి పరలోకంబందు నీలోకముల్
బ్రాకామ్యంబుల నిచ్చు నిక్కమది శర్వా! సర్వలోకేశ్వరా! ౫౨

వ్రతదానక్రతుయోగమూలమున లభ్యంబైనపుణ్యంబు నీ
స్తుతి యొక్కట్టు ఘనోరు పుణ్యాలవముం దూఁపంగఁ ద్వత్స్తోత్రపు
న్నతియే కోటిమడుంగు లెక్కనగు నంతస్సార మూహింప సు
వ్రతసేవాఫలమే యగణ్యమగు శర్వా! సర్వలోకేశ్వరా! ౫౩

అనర్ఘాంగవిశాలనేత్రములు నేత్రానందముం గూర్ప సు
శ్లోకం బౌముఖపంకజంబు సిరిచే శోభింప విస్తీర్ణమౌ
లోకాళుల్ మెచ్చులలాట మొప్పఁగ మహాలోలత్వముం గూర్చు స
ర్వాంగస్ఫురంబగుమూర్తిఁ దాల్చితివి శర్వా! సర్వలోకేశ్వరా! ౫౪

నగుమోము న్నిగమోక్తి నిర్ఝరముగా నానారసాస్వాదనా
సుగుణోత్పత్తి భవజ్జనిస్ఫురితమై శోభింప నిత్యప్రస
న్నగరిష్ఠం బగు నీముఖాంబుజము చెన్నార నస్మదీయాత్మలోఁ
బగలున్ రేలును నిల్పుఁగావుతను శర్వా! సర్వలోకేశ్వరా! ౫౫

నాతండ్రీ! ననుఁ గానఁ బుట్టిన జగన్నాథుండవే నీవు నీ
ఖ్యాతాత్పర్యమున న్జముండవని నిన్నత్యల్పునిం జేయుచో
రాతంకిం బొకయింతి లేక నరకంబందు బ్రవేశింపనే
ప్రాతస్సంధ్యల నిన్ స్తుతించెదను శర్వా! సర్వలోకేశ్వరా! ౫౬

స్ఫుటజృంభంబు ముఖారవిందము మహాసూర్యాగ్నిప్రభాసంబు, ను
త్కటసుజ్ఞానమయూఖమాలికలకున్ స్థానంబు కంఠోగ్రము, నీ
నిటలంబున్ దలఁపు ల్విశాలములు, సిద్ధప్రప్రభాజాలమై
పటురూపంబు ధరించె నీవుగను శర్వా! సర్వలోకేశ్వరా! ౫౭

పలుకుల్ తేనెలు భావము ల్మధురముల్ భాషించుచో రత్నముల్
వెలికిం జిమ్ముట లూరకుండుటె మహావేదాంతబోధంబు నీ
తలఁపే బ్రహ్మము నిన్నుఁ గాంచుటె మహాతత్త్వంబు నీస్పర్శయే
పలుకుల్ నేయుననేల? ముక్తియగు శర్వా! సర్వలోకేశ్వరా!

శాస్త్రజ్ఞానము శస్త్రసాధనలచేఁ జావంగఁ జంపంగ బ్ర
హ్మాస్త్రంబుల్ రచియించి చంపుకొనఁగా నేఁ గాని తత్త్వంబు నే
శాస్త్రజ్ఞుండు గ్రహింపనేర్చె నిఁక నాశాస్త్రంబులం గాల్చనా?
వస్త్రం బైనను రాదు శాస్త్రముల శర్వా! సర్వలోకేశ్వరా! ౫౯

ఆ లంచు న్నుడిబంధ నొక్కటి గళంబందున్ బిగింపన్ గడున్
మేలుం గాంచితి నంచు వెఱ్ఱియయిసున్నిమ్మో మోసపోవున్ జనుం
జాలుం బిడ్డలె ఘోరపాశములుగా నాపాదమున్ జుట్టఁగా
ఫాలాక్షా! కలదే సుఖం బనఁగ శర్వా! సర్వలోకేశ్వరా! ౬౦

చదువు న్నందెయు లేక నీఘనకటాక్షం బింత సోఁకంగ నన్
విదుఁడుం గోవిదుఁ డంచు లోకు లన నేవిద్యావిశేషంబో కో
విదుఁ డైతిన్ భవదీయసత్కృపఁ గృపావిష్టాత్మఁ గానంగలే
ర దరిద్రుల్ జను లేమనంగలను? శర్వా! సర్వలోకేశ్వరా! ౬౧

అంతం బన్నదిలేదు నీమహిమకా వంతైన సర్వజ్ఞ భా
స్వంతుం డైతివి చూడఁ జూడఁగఁ బరబ్రహ్మానుభావంబు వే
దాంతం బంట సమస్తమం దిముడు నా కాశ్చర్యమే లేదు స
ర్వాంతానూనమహాప్రభుండ వీక శర్వా! సర్వలోకేశ్వరా! ౬౨

త్వత్కంఠారవదివ్యదుందుభినినాదం బెంచ వజ్రంబె యా
స్వోత్కర్ష న్నినుఁ బట్టు దుర్జనకుభృద్భూతాళికి న్జూడఁగా
నుత్కంఠ న్నినుఁ గొల్చువారి కదియో యుత్కృష్టశోభాకరా
పత్కాలోద్ధరణం బగు న్నిజము శర్వా! సర్వలోకేశ్వరా! ౬౩

ప్రతినిత్యంబును నీపదాబ్జములకుం బ్రత్యూషవేళ న్విభూ!
సతము లర్చించి హృదంతరంబున నినున్ ధ్యానింపఁగా సర్వదే
వతలుం గానని చిత్స్థిరత్వము జగద్బంధుత్వము నైస్సఖ్యమున్
ప్రతిపుణ్యంబు లభించుచుండఁగద శర్వా! సర్వలోకేశ్వరా! ౬౪

ధనమా శాశ్వత? మంగనాజనములా తత్త్వోపదేష్టల్? ప్రభూ!
మనమా నిశ్చల? మాయువా? స్థిరము సమ్మానంబులా కోరికల్?
వనమా ముక్తిద? మయ్యలా ప్రభులు? బువ్వావాంఛసీయంబు? పా
వనమా సంపద? లౌల్యమా గుణము? శర్వా! సర్వలోకేశ్వరా!

అరరే! మూర్ఖులు మూఢు లంధులు మహాహంకారనిర్మగ్ను, లీ
శ్వరవిద్రోహులు పాపసంభవులు దుశ్చారిత్రు లత్యల్పు లె
వ్వారు నిన్ను న్నినుఁ గొల్చు మమ్ము మఱి మా భక్తాళి నిందింపఁగాఁ
బరులం జేరుదు రట్టివారి కన శర్వా! సర్వలోకేశ్వరా! ౬౭

దేహంబంతయు భూతి నీ వలఁది వాగ్దేవీకృపాలంబియై
"యోహో! శంకర! శర్వ! ఈశ!" యని నీవోప్పార ని న్బిల్చుచో
న్మోహాశాద్భుతదర్శనోత్సవ మగున్ మాకు స్మహాదేవ! ని
ర్వాహింపంగల వెన్ని రూపములో? శర్వా! సర్వలోకేశ్వరా! ౬౮

భవభక్తప్రవరా! త్వదీయ జగతీప్రాశస్త్య సౌభాగ్యముల్
అవిలంఘ్యం బగు సంస్కృతీజలధి దేవా! దాంతు నైపుణ్యముల్
భవబంధచ్ఛిదనంత శక్తియు జగద్బంధుత్వసద్భావ మా
రవి చంద్రానలబుద్ధులై వెలుఁగు శర్వా! సర్వలోకేశ్వరా! ౬౯

దానత్యాగపవిత్రవర్తనములన్ ధర్మప్రతిష్ఠాపనన్
జ్ఞానధ్యానమహావివేకగుణవిజ్ఞానంబులందున్ రసా
స్వానాస్వాదనశక్తియుక్తుల నగణ్యోదారభావంబులన్
రాణింపం జోరుఁ డీవు దక్క నీక శర్వా! సర్వలోకేశ్వరా! ౭౦

నీ గానంబున రాల్గరఁగును భవన్నిర్మోహసంపత్తికిన్
యోగీంద్రుల్ భళిరే యటంద్రు భవదీయోత్సాహవిస్ఫూర్తికిన్

రాగాంధత్వము గప్పు దేవతలు స్వర్గవ్యగ్రత ల్వీడి దే
వా! గంధర్వులు నిన్నుఁ బాడుదురు శర్వా! సర్వలోకేశ్వరా!

గుదసంతోషణ మాచరించుటమొద. ల్కూర్చుంట నిల్చుంటయున్
సదభిప్రాయయుతాస్యభాషణము సత్సంభావనా నైపుణుల్
విదితంబౌ విధముల్ సమస్తమును నిర్విఘ్నంబుగా నీకడన్
బ్రతుకంగాఁ గలవారె. సజ్జనులు శర్వా! సర్వలోకేశ్వరా! ౨౧

నీకు న్స్తోత్రముఁ బట్ట నీయడుగుల న్సేవింప నిన్నాసఁగా
నీకారుణ్యముఁ గాంచ నిన్బొగడఁగా నీవాక్సుధం గ్రోలఁగా
నీకై మ్రొక్కఁగ నిన్భజింపఁగ నినున్నిత్యంబు దర్శింపఁగాఁ
బ్రాకామ్యంబుల నందఁ గోరుదును శర్వా! సర్వలోకేశ్వరా! ౨౨

భవదీయంబగు సత్కటాక్షమునకు న్పాత్రుండు గానట్టి మా
సవ్వుఁ డెన్నన్ శిశిరర్తువందుఁ బడుపర్ణంబెన్న నాపర్ణమున్
జవమున్ జీవము వాసి రాలి పడి నిస్సారంబునై పోవు స
వ్యవసంతామలయోగమున్ గనక శర్వా! సర్వలోకేశ్వరా! 23

ఘనపక్షంబులఁ దాల్చి పొంగిపడుచు న్గర్వప్రవృత్తాత్మ భా
నునివంక న్బఱతేర నాతపనుతీక్ష్ణోదగ్రకీలావళిన్
గని పక్షంబులు బుగ్గిగా నొడలు దగ్ధంబౌ ద్విజప్రక్రియన్
వసరుం జీవియు నిన్నెదుర్చునెడ శర్వా! సర్వలోకేశ్వరా! ౨౪

కలలోఁ గాంచినదుఃఖముల్ మనము ప్రస్రుక్కంజేయ భ్రాంతంబుగాఁ
దెలియన్నేరక క్రుంగిపోయి నిజమన్దృష్టిం బ్రలాపించు నా
కలలోఁ గాంచిన వెంత సుస్థిరములోఁ గాంచు న్మనుష్యుండు నా
వల నేల్కాంచి భవాబ్ధిసౌఖ్య మిదె శర్వా! సర్వలోకేశ్వరా!

మును నీచే నపవర్గ రాజ్యసుఖసమ్మోదంబు నిత్యాత్మ మం
దిన పుణ్యాత్ములు నిన్ను సారథిగ మైత్రి న్గొల్చి నిర్వ్యాపృగాఁ
గాని కామ్యంబులు మంటఁ గల్పి వ్రతసద్గోష్ఠి న్వదీయప్రభా
వనిరూఢాత్మను గన్నవారెకద? శర్వా! సర్వలోకేశ్వరా! ౭౬

నిన్ను న్సర్వమునందు సర్వమును దా నీయందె దృష్టించి నే
తెన్నం గన్నులఁ గాంచకే వఱలు నుర్వీదేవత న్దేవతన్
అన్ను న్మిన్నను హేమము న్శిలను దేవా! నీవుగాఁ జూడ నా
పన్నత్రాణపరాయణా! యొసఁగు శర్వా! సర్వలోకేశ్వరా! ౭౭

కడుపు న్గాళ్ళును లేని కట్టుకథల న్గల్పించి చూపిష్టులై
నడుమ న్గొన్నియసహ్యవర్ణనలు విన్నాణంబుగాఁ జొన్పి యా
నడఁచు న్జీవిత మంత వ్యర్థముగ దివ్యజ్ఞానముం గానఁ జా
ల్వాఁడు మూర్ఖాత్ములు దుష్కవు ల్దలఁప శర్వా! సర్వలోకేశ్వరా! ౭౮

ఆనందం బన నన్యకాంతల ననాయాసంబునం గాంచు టే
జ్ఞానం బన్నను నాంగ్లవిద్యఁ గడు నిష్ణాతాత్ముఁ డౌ టే మహా
దానం బన్నను నీచజాతి కిడు టే తాత్పర్యమై పోయె నే
వ్వానిం బల్కెదు? నీవిలాస మిది శర్వా! సర్వలోకేశ్వరా! ౭౯

నీవే నేనయి నేనె నీవయి మఱి న్నేనే సమస్తంబు నై
యీవిశ్వం బది మద్వినిర్గతమునై యిష్టానుసారంబుగాఁ
బ్రావిర్భావము నందుచు న్వొడలుచు న్వర్తించి సంగ్రించుచు
న్భావింతు న్సకలంబు లీలగను శర్వా! సర్వలోకేశ్వరా! ౮౦

జీవబ్రహ్మలు వేఱుగాఁ దలఁచుచో సేవింతు భృత్యుండనై
దేవా! శంకర! ఈశ్వరా! నిను సదా దివ్యాత్మభక్తుండనై
జీవబ్రహ్మల నద్వయం బనుచు నేఁ జింతించువేళ న్మహా
భావుండ న్ననిశంబు నే నగుదు శర్వా! సర్వలోకేశ్వరా! ౭౧

ఏభావంబున నేవిధంబున మహాహీనాత్మసంతుష్టియౌ
నాభావంబున నామహార్థమున నిన్నర్చించి పెంపొందుదున్
ప్రాభాతార్కసహస్రసామ్య మది నీబ్రహ్మప్రవర్చస్సు దే
వా! భక్తిన్ సతతంబు గాంతు నది శర్వా! సర్వలోకేశ్వరా! ౭౨

అతులోదారమహాప్రతాపుఁడవు నీ న్నత్యంతము న్గొల్తు సం
తత సర్వేశ్వరసత్స్వరూపుఁ డగు సత్యం బెన్న భక్తుండగు సు
న్నతచూడామణిగా, మహామహిముఁడౌ, రంజిల్లు లోకంబులన్
ప్రతియే లేని మనీషివై, నిజము శర్వా! సర్వలోకేశ్వరా! ౭౩

నీ విఖ్యాతచరిత్రముల్ దడవుచు న్నీపల్కు లాలించుచున్
నీ విద్యావినయప్రవృత్తులు మది న్నిత్యంబు భావించుచున్
యీవిశ్వంభర జీవయాత్రకొఱకే నిచ్చించియున్నాఁడ నీ
ప్రావిర్భావము మాదుపుణ్య మది శర్వా! సర్వలోకేశ్వరా! ౭౪

పురుషుం బుణ్యము లాస్తిపాస్తులు మహాపుణ్యంబుఁ బాపంబులు
న్నరనారు ల్పురు లాత్మలు న్ధనములు న్ధాన్యంబులు న్సొత్తులున్
గిరులు న్వాజులు గంధము ల్సలములు న్గర్మంబు మర్మంబులున్
నటుల న్జేసితి వెన్నొ లీలనయి శర్వా! సర్వలోకేశ్వరా! ౭౫

ధర్మంబుల్ గరుణింతుఁ బ్రీతి నని గీతాశాస్త్రముం జెప్పి యా
ధర్మంబు ల్నశియించుచుండఁ గనియు న్దాటస్థ్యముం దాల్చి యే
మర్మంబు న్ననట్టు లుందువది మామాకర్మముల్ గాక యే
వర్మంబుల్ ధరియింతువో యెఱుఁగ శర్వా! సర్వలోకేశ్వరా!

పరనారీపరకాంచనాభిరతి యెవ్వారుం గనంబోని యీ
భరతాఖ్యప్రథితప్రపంచమున దౌర్భాగ్యంబున న్నేఁడ యీ
పరనారీపరకాంచనాభిరతి పర్వంజొచ్చె నత్యంతమున్
బరిపూర్ణం బగు నాశకారణము శర్వా! సర్వలోకేశ్వరా! ౧౭

నాకేలా? భువనప్రపంచవిలసన్నాట్యాంశ మీవుండఁగాఁ
గెక్కో రక్షణ మాను నే నెవఁడ నీకై చెప్పఁగా? దేవ! నా
చీకాకుల్ తలపెట్టి చెప్పుకొనఁగా సిగ్గౌను నజ్ఞానినై
వాకొన్నాఁడ క్షమింపఁగాఁ దగును శర్వా! సర్వలోకేశ్వరా! ౧౮

ఒకటేయున్నది యుండెఁ ముందు మఱి రెండున్నట్టులూహింపఁజే
సకలార్తిప్రదయౌ; నిరంజనము నిస్త్రైగుణ్యనిర్భిన్న మౌ
యొకటే నే ననుచిత్స్థిరత్వ మది యే యాసాస్య మద్వాని దే
వ! కృపాసంస్థితిఁ గాంచి మించెనను శర్వా! సర్వలోకేశ్వరా! ౧౯

ఎందాఁకన్ హృదయాంతరాళమున నాకేనన్న భావం బగున్
అందాఁక న్నిను నద్వితీయగురుఁగా నాచార్యుఁగా శంభుఁగా
డెందాన న్దలఁపోయుదు న్గొలుతుఁ జాటింతు న్మహాభక్తితో
వందింతు న్గరుణాప్రసాద మిడవు శర్వా! సర్వలోకేశ్వరా! ౨౦

ఈశా! వ్యాసపరాశరాదికనుతా! యిష్టార్థసంధాయకా!
ఆశాస్యాఖిలసిద్ధిదాయక! మహేశా! దేవదేవాధికా!
కాశీనాథ! సనాథనాథ! జగతీకారుణ్య! సంసారదు
ష్పాశచ్ఛేదకరా! జగద్రమణ! శర్వా! సర్వలోకేశ్వరా! ౯౬

దేవా! మంగళమంగజాతనిధనా! దివ్యాత్మ! శర్వా! ప్రభూ!
భావోద్రేక! శశాంకశేఖర! జగద్భద్రంకరా! యీశ్వరా!
ప్రావృట్కాలపయోదసన్నిభమహారావాన్వితా! శంకరా!
భావాభావవిభావభావుకుఁడ! శర్వా! సర్వలోకేశ్వరా! ౯౭

శర్వా! సర్వదిగంతరాత్మ! పరమాశ్చర్యాన్వితా! ఈశ్వరా!
సర్వాధ్యక్ష! సమస్తలోకవరదా! సర్వేశ్వరా! శంకరా!
గీర్వాణార్చితపాదపద్మయుగళా! కేళీప్రదా! చిత్సుఖా!
పార్వత్యంకతలప్రభూతసుఖ! శర్వా! సర్వలోకేశ్వరా! ౯౮

భక్తాధీనమనోంబుజాత! కరుణాసాంద్రోన్నిధీ! శంకరా!
యుక్తాయుక్తవివేకమూలమ! మహాయుక్తిప్రధానాత్మ! శ్రీ
భక్తాభీష్టవరప్రసాద! సుగుణాభ్యర్చాన్వితా! యీశ్వరా!
భక్తానీకవశంకరా! గురుఁడ! శర్వా! సర్వలోకేశ్వరా! ౯౯

జననం బందితి నేను శ్రీబుఁగుసువంశంబందు నాయకసా
దుని సద్గోత్రజుఁడన్ త్వదీయసదభక్తుండఁగా నినున్ నిత్యముం
గని పూజింతును వేంకటేశ్వరుఁడ నీకారుణ్య మర్థించుచున్
ఘనతన్ నుంటిని స్వీకరింపు మిఁక శర్వా! సర్వలోకేశ్వరా! ౧౦౦

*



R. & Co. శ్రీ సాయీ ప్రింటర్సు, కాకినాడ.